## ఖమ్మంవిద్యార్థుల అసౌకర్యములు

ఖమ్మం. జూను ౨౪

ఖమ్మం హైస్కూలునందు జేరబోవు విద్యార్థులను హెడ్మాష్టరుగారు సర్టిఫికేట్లులేనివారిని చేర్చుకొనవని చెప్పుటచే ప్రైవేటుగా చదివి వచ్చిన విద్యార్థులకు విద్యాభివృద్ధి అవకాశములు లేకున్నవి. గవర్నమెంటు తహతానియాయందు కృతార్థులై సర్టిఫికెట్టుపట్టుకొని వెళ్ళినవారినికూడా పరీక్షచేయనిదే పైతరగతియందు చేర్చుకొనకనుటవలన, తిరిగి పరీక్షచేయుటయందు తప్పిపోయిన దురదృష్టవంతులగు విద్యార్థులు మరల తహతానియాలో ఆదేతరగతి చదువవలసి వచ్చుచున్నది. ఇది చాలా నిరుత్సాహకరమైన విషయము. దూరపుపేటలనుండి వచ్చి విద్యనభ్యసించుకొను విద్యార్థులకు టిఫిన్ క్యారీయర్లు పెట్టుకొనుటకుగాని, సైకిళ్లు పెట్టుకొను ఏర్పాట్లుగానిలేకపోవుట చాల అసౌకర్యముగానున్నది. తల్లిదండ్రులుకూడా యీవిషయములకు నిరుత్సాహులగుచున్నారు. కాన అధికారులు గమనించి తగిన మార్పులతో విద్యార్థులకు సౌకర్యములు కలుగజేయుచు విద్యాభివృద్ధికై చేయూత నొసఁగ ప్రార్థన

ఒక విలేఖరి

## ఖమ్మం విద్యార్థిసమితి

ఖమ్మంమెట్టు, అమర్దాదు ౧౩

నేను హైస్కూలు విద్యార్థిసమితి (Students' union) శ్రీయుత ౧౦గాగారి అధ్యక్షతన సమావేశమై నూతనసంవత్సర కార్యక్రమము నిర్ణయించెను. సమావేశమునకు హారిజన పాఠశాలోపాధ్యాయులగు శ్రీయుత వై. కే. మూర్తిగారును మరిపెక్కుమంది విద్యార్థులున్ను వచ్చియుండిరి. ఈక్రింది పాలకవర్గము ఎన్నుకొనబడెను.

అధ్యక్షులు, టి యల్. (?) (పదియవతరగతి) కార్యదర్శి, హనుమయ్యగారు (తొమ్మిదవతరగతి) సహాయకార్యదర్శి, వి. లక్ష్మీనారాయణగారు (ఏడవతరగతి) మరియు ౧౨ గురు కార్యనిర్వాహకసభ్యులు.

## ఖాక్సారు ఉద్యమము

### గుల్బర్గాలో తుపానువలె వ్యాపించినది

వక్తుపత్రికలోని వార్తప్రకారము గుల్బర్గాజిల్లాలో ఖాక్సారుఉద్యమము ఒక తుపానువలె అభివృద్ధినొంది జిల్లాఅంతటను అల్లుకొనిపోయినది. మహాగాం, కమలాపూరు, సౌన్తు, ఆటకల్, చన్నోలాండ దండూతీ జాగీర్, హుమ్నాబాదు చిడ్గొప్పఅను స్థలాలలో మసీదులలోను ఇతరస్థలాలలోను సభలు జరిగినవి. ప్రచారకులు ఖాక్సారు వాఙ్మయాన్ని పంచినారు ఉద్యమములో అనేకమందిని చేర్చినారు. గొప్పగొప్ప ఉపన్యాసాలిచ్చినారు.

## బిదరుగంజిని కాల్చినవారు

### ౩౬ లో ౭ మందిని వదలిపెట్టినారు.

బిదరులో గంజిని అంటుపెట్టినారని ౩౬మంది ముసల్మానులపై అభియోగము తేబడియుండెను. నిందితుల వకీళ్లు ౧౫ అర్జీబెహుస్తునాడు రెండు దినాలవరకు నిందితులు ఏపాపమున్నూ ఎరుగరని సత్తువకొద్ది వాదించిరి. తుదకు ఆ ౩౬మందిలో ౭ మందిపై నేరము బుజువుకాలేదని న్యాయాధీశ్వరులుంగారు వదలిపెట్టిరి. మిగత ౨౯ మందిపై నేరస్థాపన (ఫర్దజూరం) తెగిలించినారు, అందుపై కావలసిన తీదంగాలకుగాను ౨౨ అపుర్దాదునాడు (పేషీ) విచారణసభ నేర్పాటుచేసియుండిరి. ఆనాటినుండి వరుసగా అజ్హసవాళ్లు, సవాళ్ళపైన సవాళ్లు, సఫాయి (తూడ్పుసాక్ష్యము) తదితరములు తీసుకొనబడును.

## బాన్స్వాడలో కలరా

(స్వ. వి.)

ఇచ్చట ఒక నెలనుండి కలరా వ్యాపించింది చాలామంది చనిపోయినారు. ఇంతవరకు సుమారు ౫౦ మంది చనిపోయినారు. చుట్టుపట్టుగ్రామాలలోకూడ కలరా వ్యాపించినది.

౧౨ అమర్దాదునాటినుండి వర్షాలు ఆరంభమైనవి. ఇచ్చటి సమీపములోనున్న దురికి అనే గ్రామములో పిడుగుపడి యిద్దరుచనిపోయిరి.

## మెదకు జిల్లాలో బస్సు ప్రయాణికుల చిక్కులు

(స్వ. వి.) శంకరంపేట అమర్దాదు ౧౩

ఈసంవత్సరము ౧౩౪౯ ఫ. వర్షములేక పైర్లు ఎండిపోయి అనేకవిధములుగ రైతులు సష్టపడిన విషయము లోకవిదితము. ప్రభుత్వమువారు మాఫీలొసగియుండిరి. ఇప్పుడు మాయూరను మరి మాప్రాంత గ్రామములలోను తాబీలో చెరువులో నీరులేకపోయినందున రెండుకారులనంబర్లను ఖుష్కిసేద్యంప్రకృతి సిద్ధమైన పదనును సేద్యముచేసిరి కానిఏమాత్రముఫలించలేదు. ఇప్పటిభూములపై అనగా ఏభూములైతే రెండు కార్లనంబర్లు చెరువుపారకముని అబీకాస్తుఅయ్యె, తాబీఫసలీ చెర్లలో నీళ్లులేనందున జొన్న, సెనిగె. అనుము మున్నగుఖుష్కీమాల్గుజారీవసూలుచేయుగూడదు"అని గష్తీనిషాన్ ౨౩ చర అర్జిబెహుస్తు సన ౧౩౪౯ ఫ మాల్గుజారీనుండిగా వించియున్నను, ఇప్పుడుఖుష్కీపన్ను విధించియున్నారు. కావున ఈకరువుకాలమున తమజీవితముగడుపుటే దుష్కరమై యుండ ఇక పన్నులుచెల్లించుటకై రైతులనున్నదా! కావున ప్రభుత్వమువారు విచారించి కరుణించుమురని యూసించుచున్నాము.

అలంపూరు

## చెన్నబసవేశ్వర సిద్ధీక్ శిష్యుని ఆగ..న ..

(ఓ. వి.)

రెండువారాలక్రిందట గోలకొండ స్వకీయవిలేఖరి మాఅలంపూరులో హిందూముసల్మానులు చాలా ఐకమత్యంగా ఉన్నారని వ్రాసియుండినది చూచినాను. అదినిజమే. కాని ౧నెలక్రిందట ఈఊరికి నఖిలీ చెన్నబసవేశ్వరుని అవతారమని చెప్పుకొనుచు మతాంతరవ్యాప్తి గావించుచున్న సిద్దిక్ అనువాని శిష్యుడొకడువచ్చి ఒకముసల్మాను ముఖ్యునియింట బసచేసెను. సభచేసేదానికి ప్రయత్నముచేసెను. సెలవ్వదొరకలేదో అప్రలుపద్దని మందలించినారో యేమోకాని సభమాత్రము చేయలేదు. కొందరు ముసల్మానులవద్ద చందాలుమాత్రము వసూలుచేసుకొనిపోయెను ఇట్టి నఖిలీప్రచారకులు ఎక్కువగావస్తే ఈతాలూకాకూడా ఇతరప్రాంతాలవలె చెడిపోయినవాతావరణముకలదిగానుండును.

### రైల్వేబస్సులు

మాజిల్లాలో రైల్వేబస్సులు ఏర్పడి చాలాకాలమైనను, ప్రయాణికులకు, సరిపోవు బస్సులు ఏర్పాట్లవిషయమున, ఏప్రాంతమున కొన్నిమారులు ఎన్నిబస్సుల అవసరమోయని గతకాలానుభవమునుబట్టి ఆవసరమార్పులు గావించకపూర్వము ఉన్నఏర్పాట్లే ఇప్పుడు ఉండుటవలన ప్రయాణీకులకు బస్సులలో స్థలముజాలక ఎన్నియో ఇక్కట్టులు కలుగుచున్నవి. హైదరాబాదునుండి సిద్దిపేటకు మరియు హైద్రాబాదనుండి సంగారెడ్డి నిజాంసాగరుకు వెళ్ళుబస్సులలో స్థలముచాలక మార్గమధ్యమున ఎందరో పలుమారులు వదలబడుచున్నారు. అట్టివారు ప్రభుత్వసంబంధమైన పేషీలకు మరియు స్వంతపనులకు సకాలమునకు అందజాలక గొప్పనష్టములకు పాలగుచున్నారు. కావునప్రయాణీకుల అందుబాటులోనుండునటుల ఆవసరమార్పులు గావించుటత్యవసరము.

మరియు ప్రయాణీకులు బస్సురాకకై కొంతకాలము నిరీక్షించవలసియుండును, అట్టివారు వానలో వానుచు ఎండలో ఎండుచు నుండవలసియుండును. కావున నిజామాబాద జిల్లాలోవర్ని, బాన్స్వాడ, నిజాంసాగర్, పిట్లము మున్నగు స్థలములలో ప్రయాణీకుల సౌకర్యమునకై ఏర్పాట్లుగావించినటుల ఈజిల్లాలో సంగారెడ్డి, మెదకు, సదాశివపేట. జోగీపేట, యెల్లారెడ్డి మున్నగు యీలాటిముఖ్యస్థలములలోనైనను ప్రయాణీకుల సౌకర్యమునకై బస్సుశాఖావారైనను, లోకల్ ఫండు శాఖవారైనను శీఘ్రముగ ఏర్పాట్లుగావించుటత్యవసరము.

# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర జ్యేష్ఠ బ॥ ౧౧

సోమవారము


## మత విచారణ సంఘాలు

౧౯-౮-౩౯ ఆగస్టు నాడు ప్రభుత్వమువారు "మత సంబంధమైనట్టియు అట్టివే యితరమైనట్టియు స్వాతంత్ర్యముల విషయమై విశదీకరించినట్టి ఒక అధికార ప్రకటనను" కావించిరి. అందు మత సంబంధమైన విషయములో నిట్లు తెలిపిరి:—

"ప్రాథమిక మతాధికారములను గురించి యిదివరలోనే తెలుపబడినది. మతశాఖకు సంబంధించినట్టి ఆలోచనా సంఘములు ఏర్పాటుచేసి వాటిద్వారా మత సంబంధమగు నియమాలలోని హక్కుల పరిపాలనము జరుగును. కొన్ని విషయాలలో ఈ ఆలోచనాసంఘాల కార్యక్రమము రహస్యముగా నుంచబడవలసియుండినను సాధారణముగా ఈ సంఘాల సలహాలను ప్రభుత్వము వారొప్పుకొనుచుందురు. మతసంబంధమైననియమములను శాసనాలలోనున్న హక్కులను, ఈసలహా సంఘాలు సరిగా అమలులోనుండునట్లు చూడగలరు. ప్రజాశాంతిని దృష్టిలో నుంచుకొని ప్రజలకు వీలైనంత ఆనుకూల్యము కలిగించి అధికమగు స్వాతంత్ర్యమును ప్రసాదించుటయే ప్రభుత్వవారి యుద్దేశమై యున్నది."

వీలైనంతవరకు ఇంగ్లీషులో నుండినట్టి డొంకతిరుగుడు రాజకీయభాషలోని భావాలను మేము తెనుగులో పెట్టినామనుకొందుము. పై దానినిబట్టి మతసంబంధములో ఏర్పాటుచేయబడు సలహా సంఘాలు ప్రభుత్వ మత శాసనాలను సమన్వయించుకొనుచు ప్రజలకు మత స్వాతంత్ర్యములో భంగముకాని, సంఘర్షణకాని లేకుండాచేయుటయేప్రభుత్వోద్దేశమనిపించుచున్నది. అయినను పై ప్రభుత్వప్రకటన స్పష్టముగా లేదనియే మా యభిప్రాయము. ఇదివరలోని మతసంబంధమగు నియమాలవలన, శాసనాలవలన ప్రజలకు కొన్ని యిబ్బందులు కలిగినవి. వాటిని తొలగించుటకై కమిటీల నేర్పాటుచేసి ఆ నియమాలనే పరిపాలించుమనిచెప్పిన పూర్వాలోపాలు పోనేరవు. ఇది మూలసిద్ధాంతము. మూలమునే సంస్కరించక దానిపై యెన్ని సౌధాలుకట్టినను అవి సరియైన పునాదులులేనివిగానే యుండును.

ఇది యిట్లుండ ౧౯ జూలై ౪౦ నాడు ప్రభుత్వమువారు మత విచారణ కమిటీలను ఒక సంవత్సరము క్రిందటనే ఏర్పాటుచేసినామని తెలిపినారు. ౧౭ జూలై ౧౯౩౯ నాడు ఒక ప్రకటనలో ఆర్యసమాజీయుల ఆరోపణ లన్నింటిని ఎదుర్కొనుచు ఎనిమిది పుటల ప్రకటన ప్రభుత్వమువారు కావించియుండిరి. అందు తుదిలో ఇట్లువ్రాసిరి:—

"రాజ్యాంగ సంస్కరణల కమిటీ వారు సిఫారసుచేసినట్లు రెండు కమిటీలు (హిందూముస్లిములవి) మత సంస్థల విచారణకై ఏర్పాటు చేయబడును. అంతేకాక ఒక స్థాయిసమితిని ఏర్పాటుచేసి దానిద్వారా ఎవ్వరికైనా ప్రభుత్వనియమాలవల్లకాని నియమాల పరిపాలనవల్లకాని దేవపూజాదికములలోకాని మతాచరణములలోకాని నిరోధము, ఇబ్బందియుండిన విచారింపజేయబడును. ఈ సమితిలో అధికారులు అనధికారులు సరిసమాన సంఖ్యలోనుందురు- హిందూ ముసల్మాను సభ్యులసంఖ్య సరిసమానముగానుండును."

౧౯ జూలై ౧౯౩౯ నాడు విఖ్యాత రాజ్యాంగ సంస్కరణలు రానేవచ్చెను. ఇట్లు రాజ్యాంగ సంస్కరణములలో సూచితమై ౯ ఆగస్టు ౩౯ నాడు మరి కొంత స్పష్టీకరింపబడినట్టి మత విచారణ కమిటీలనుగురించి మొన్న ౧౮ జూను నాడు ప్రకటనశాఖవారు మనకు తెలిపినారు. అయితే యీ కమిటీలను స్థాపించి యింకా ఒక సంవత్సరము పూర్తి కాలేదు. ౧౯ జులై నాడు రాజ్యాంగ సంస్కరణ ప్రకటన జరిగెను. ౯ ఆగస్టు నాడు వివరణ ప్రకటన జరిగెను. కావున ఈ కమిటీలు ఆగస్టునుండి పనిచేసినవన్నచో ౧౦ నెలలు పనిచేసిన వన్నమాట. ఇవేమిపని చేసినవి అను విషయమును క్లుప్తముగా తెలిపినారు. దానిని ఇదివరలోనే మేము తెలిపియున్నాము. వారు చేసిన పనులివి.

౧. దౌరాచేయుట
౨. నెలనెలకు సమావేశమగుట
౩. పూజాస్థలాల రిపేరీలను విచారించుట
౪. జనుల ఆధ్యాత్మికోన్నతికి ఏర్పాటుచేయు విషయములను ఆలోచించుట
౫. బీదవారికిని వయసుచెల్లినవారికిని చదువు చెప్పించుట
౬. ప్రభుత్వానికి ప్రతికూలముగా జరిగిన ప్రచారమును ప్రతిఘటించుట

ఈ ఆరుపనులను ఈ హిందూ ముసల్మాను మతవిచారణ కమిటీలు చేసినవి.

హిందువుల కొరకు కమిటీ ముసల్మానుల కొరకు కమిటీ ఏర్పాటుచేసినారట. ఈ కమిటీలలోని సభ్యులందరును అధికారేతర సభ్యులనియు తెలిపినారు. ఇది బాగుగానేయున్నది. కాని సభ్యులెంతమంది? వారెవరు? వారి పేరులేమి? అను విషయములు తెలుపలేదు. ఈ సభ్యులు ప్రజలలో సుప్రసిద్ధులై పలుకుబడికలిగి మత విషయములందు సానుభూతికలవారుగా నుండియుందురని ఊహించుచున్నాము. వీరు "తమతమ కేంద్రాల"లో దౌరాచేసినారని తెలిపినారు. ఎచ్చటెచ్చట దౌరాచేసిరో వివరాలు తెలియదు. హిందువులకొరకు కేంద్రము ముసల్మానుల కేంద్రము ఉండజాలదు. ప్రతి గ్రామములోను హిందూ ముసల్మానుల దేవళాలు, మసీదులు, దర్గాలు, గుళ్లు కలవు.

ఈ కమిటీపెద్దలు ప్రజల ఆధ్యాత్మికోన్నతికి అవసరమగు విధానాలను ఆలోచించినారని తెలుపపడినది అనగా ఇందలి పెద్దలు గొప్పవిద్వాంసులు, పండితులు, మౌల్వీలు, అయి యుందురని ఊహించుచున్నాము. ఇది చాలాగొప్ప విషయము. జనులను "గుండా"సంస్కృతి నుండి ఉద్ధరించి సాత్విక సంస్కృతిలోనికి తీసికొనివచ్చుట అసాధారణమగు విషయము. అదియే మనకిప్పుడు చాలా అవసరము. ముసల్మాను కమిటీవారు చాలమంచిపని చేసినారు. బీదలకును వయోజనులకును పాఠశాలలను స్థాపించినారు. కాని హిందువులు ఒక్కటేఒక్క సంస్కృతపాఠశాలను పెట్టవలెనను ఆలోచనలోనున్నారట. మాతృభాషయేరాని సామాన్యప్రజలకు, అనూచాన సంతతికి అవసరమగు దేవభాషను చెప్పించుటలో ఏమి ప్రయోజనమో ఏమో? సంస్కృతభాషను చెప్పించు నేర్పాటుచేయుటలో చాల యిబ్బందులున్నవి. ఒకటి అది ప్రజాసామాన్యానికి అందుబాటులోలేనట్టిది. రెండవది అది సనాతనుల యభిప్రాయప్రకారము స్త్రీ శూద్రులుచ్చరించరానట్టిపవిత్రభాష, అందులోను వేదాధికారము శూద్రులకు లేనేలేదట. మరి హిందూమతానికి వేదమువునాది. ఇక ఈఆలోచనలోనుండిన సంస్కృతపాఠశాలలో రామశబ్దాలు చెప్పింతురా లేక డుకృఞ్ కరణే అని వల్లింతురా? లేక సహస్రనామావళి కంఠపాఠము చేయింతురా? ఏదియు స్పష్టముకాలేదు. ఇట్లనుటచే మేమేదో పరిహాసము చేయుచున్నామని అపోహపడకూడదు. ప్రభుత్వ శాఖవారు తెలిపిన ప్రకటనలో ఈ కానున్న పాఠశాలలో "ఆధ్యాత్మిక విద్య" (spiritual education) చెప్పింతురని వ్రాసినారు. ఆధ్యాత్మికమన్నప్పుడు వేదవేదాంగాలు చెప్పవలెను. అవి శూద్రులకు చెప్పింతురా? చెప్పించనిచో ఇక మిగిలినవి శబ్దమంజరి హితోపదేశమేకదా. మరిపైగా ఈ హిందూకమిటీలోనున్నవారు శైవులా వైష్ణవులా, సనాతనులా? సంస్కారులా? ఆర్యులా, తదితరులా? ఈరాష్ట్రములో ౨౫ లక్షల హరిజనులున్నారు. వారును హిందువులే. వారికొరకై వారిలోనుండి ఒక సభ్యుడు ఈ కమిటీలో నుండుట ముఖ్యాతిముఖ్యము. అట్టివారెవరును లేనట్లున్నదని ఊహించుచున్నాము. ఈకమిటీల వశములో కొంత నిధియున్నదని ప్రకటనలోని సందర్భ వాక్యాలను బట్టి ఊహించుట కవకాశమున్నది. ఎంత నిధి వీరివశములోనున్నదో ఇంతవరకు దానినెట్లు వినియోగించినారో తెలుపలేదు.

ఇన్ని ప్రశ్నలు మేమువేయుట కేవలము సమగ్రవిషయ గ్రహణమునకేగాని, 'అబద్ధంసుబద్ధంవా కుంతీపుత్రో వినాయకః' అనిఏదో ఒక ఆక్షేపణము చేయునిది ఏమివిమర్శ అనేధోరణిలోకానేకాదని స్పష్టముగా మనవిచేసుకొనుచున్నాము. ఈ వివరాలను ప్రభుత్వమువారు విశదీకరించితే చాల అనుగ్రహముగా నుండుననియు అంతవరకు మేమింతకుమించిన అభిప్రాయము మా పాఠకులకు నివేదించుకొనజాలమనియు తెలుపుకొనుచున్నాము.

---

# భారతదేశంలో యూరపియనులకు మాత్రమే నిర్బంధ సైనిక సేవ

బ్రిటను భారత దేశాలకు ఒకవేళ వ్యవహారాలాగిపోతే

## వైస్రాయిగారికి సర్వాధికారము

క్రొత్త ఇండియా బిల్లు ఉద్దేశ్యములు

సెక్రెటరీ అఫ్ స్టేట్ గారి ఉపన్యాసము

భారతదేశ రాజ్యాంగ శాసనమునందు ఉపద్రవసమయమునకు అత్యవసరములైన ఏర్పాట్లను చేయు చిత్తుశాసనమును భారతదేశపు సెక్రెటరీ అగు యల్. యస్. అమెరీ గారు లండనులో బ్రిటిషు పార్లమెంటు కామన్సు సభలో జూను ౨౫వ తేదినాడు చదివివినిపించిరి. ఇదేశాసనమునందు బర్మాకుకూడ అత్యవసరము అయిన సమయమునకు తగినఏర్పాటులు చేర్చబడియుండెను. బ్రిటిషు యుద్ధ మంత్రివర్గములో నొకమంత్రియగు సి ఆర్. అట్లీగారు ఈ చిత్తుశాసనమును వెంటనే సంపూర్ణముగా ఆమోదించుట అత్యవసరమని ప్రభుత్వమువారు మరునాడు కోరదలచియుండిరని చెప్పిరి.

జూను ౨౬వ తేదినాడు అమెరీగారు ఆ చిత్తు శాసనమును సభలో చర్చకై ప్రవేశపెట్టిరి. ఈసందర్భమున ఉపన్యసించుచు అమెరీగారు, వార్తాపత్రికలలో పెద్దపెద్ద శీర్షికలతో ఈబిల్లు ప్రతిపాదించదలచిరను వార్తను ప్రకటించుటవల్ల కొందరు ఈచిత్తుశాసనములో ఏదియో గొప్పవిశేషమున్నదని తలచియుండవచ్చుననియు, కాని అట్టి రాజ్యాంగ సంబంధమైన ప్రాముఖ్యమేదియు ఈచిత్తుశాసనములో లేదనియు చెప్పిరి. భారతదేశమునకును బ్రిటనుకును తంతిమార్గము మున్నగుసంబంధము భగ్నమగుచో, అప్పుడు ఉదయించు కొన్ని శాసనసంబంధములైన ఆక్షేపణలను తొలగించుటయే యీ చిత్తుశాసనముయొక్క ప్రధానోద్దేశ్యమని అమెరీగారు చెప్పిరి.

అయినను ఈ చిత్తుశాసనమందు ఒకముఖ్యమైన ఏర్పాటుకలదు. భారతదేశపు యుద్ధప్రయత్నమును వెంటనే విస్తరించవలెనని బ్రిటనుదేశమువలెనే సైనికసంబంధమైనట్టియు, కొన్ని సందర్భములలో సివిలుసంబంధమైనట్టియు, పరిశ్రమల సంబంధమైనట్టియు పనులకు కావలసినవారలను నిర్బంధించియైనను ఏర్పాటు చేసికొనుట సరము చాల అవసరమైయున్నదని ఇండియా ప్రభుత్వమువారు నిర్ణయమునకు వచ్చినారు. భారతీయులకు బ్రిటిషుప్రజల విషయమున అట్లు చేయుటకు ఇండియా ప్రభుత్వాధికారులకు అధికారమున్నది. త్వరలోనే గవర్నరుజనరలు ఈవిషయమున ఒకఆర్డినెన్సు (అత్యవసర నిబంధనావళి)ని చేయనున్నాడు. కాని యూరపీయులగు బ్రిటిషు ప్రజలను నిర్బంధోద్యోగమునకై రప్పించుటకు ఇండియా ప్రభుత్వమువారికి అధికారము లేదు. ఇందుకుకారణము ౧౯౩౫సం॥పు రాజ్యాంగశాసనములోని ౧౧౦వ దఫాయే. ఇది భారతదేశపు శాసనసభయొక్క అధికారమునకు లోబడకయున్నది; కాబట్టి ఆదేశీయ సైనికశాసనమునకుగాని, విమానదళ శాసనమునకుగాని, నౌకాబల శాసనమునకుగాని బాధకలిగించు ఏవిషయములోనైనను ఆర్డినెన్సుచేయు అధికారముకూడ గవర్నరుజనరలుగారికి లేకుండపోవుచున్నది. ఈశాసనములన్నియు భారతదేశములో యూరపీయులగు బ్రిటిషు ప్రజలనుగూడ వర్తించునట్లు చేయబడియున్నవి. భారతీయులగు బ్రిటిషు ప్రజలపేరు వీటిలో చేరదనికూడ స్పష్టముగా చెప్పబడినది. కాబట్టి యూరపీయులగు బ్రిటిషుప్రజలను సైనిక సేవకునిర్బంధించు ఎట్టి ఆజ్ఞయైనను ఈ శాసనములకు లోబడినదై ౧౧౦వ దఫాప్రకారము సైనిక, వైమానిక, నౌకాశాసనములను బాధించునదై యుండును. కాబట్టి ఈవిషయములో తగినచర్య గైకొనవలెనని పార్లమెంటువారు అధికార మీయవలసి యుండును.

రెండవసంగతి ఏమనగా, ఈమార్పు తాత్కాలికమే, సేనను విమాన దళమునకును నౌకాబలమునకును సంబంధించినట్టిశాసనములను బాధించువిషయములలో చర్యగైకొనుటకై గవర్నరుజనరలుకు ఈ ప్రత్యేకాధికారము నొసంగుచున్నాము.

౧౯౩౫లో ౫వ అవాంతరపుదఫాలో నున్న ఒకవిశేషమును నేను మీ కెరుకపరచవలసియున్నది. సాధారణముగా భారతరాజ్యాంగ శాసనములో ౭౨వ దఫాప్రకారము గవర్నరుజనరలు చేయు ఆర్డినెన్సులు ఆరుమాసములవరకు మాత్రమే చెల్లుబడియగును. కాని యిపుడు యుద్ధము ఎంతకాలమువరకు జరుగుచుండునో ఎవరుగాని చెప్పజాలనపుడు ఆరునెలలవరకు మాత్రమే చెల్లెడి నిర్బంధ సైనిక సేవా శాసనము అనుకూల్యమైనదకుమాట స్పష్టమే. ఇపుడు క్రొత్తగా తెచ్చిన చిత్తుశాసనములో ౧వదఫాలో ౩వ మరియు ౪వ అవాంతరపు దఫాలచే ఈ పనిచేయవచ్చును. ఈచిన్నదఫాలు భారతరాజ్యాంగశాసనపు ౧౧౦వ దఫాయొక్క బంధములనుండి గవర్నరుజనరలును తాత్కాలికముగా విమోచనము చేయుచున్నవి. ౧౧౦వ దఫాలో చెప్పబడిన నిర్బంధములు ౧౧౧వ దఫాలో చెప్పిన నిర్బంధములఫలితములైయున్నవి. భారతరాజ్యాంగ శాసనములో నుద్దేశించబడిఈమార్పు ఒకటిరెండుసైపుల మాత్రమే వర్తింపజేయబడినది. మొదటిదేమనగా, ఈమార్పు భారతీయశాసనసభకువర్తించక, తదవిచక్షణప్రకారము. అనగా, ఇప్పటికింకను సెక్రెటరీఆఫ్ సేటుగారి ఆజ్ఞప్రకారము జరుపుచున్నట్టి, అందుచేతఈసభవారిఅధికారమునకు లోబడినట్టి గవర్నరుజనరలుకుమాత్రమే వర్తించును. ఆ అవాంతరదఫా గవర్నరుజనరలుకు ఈనిర్బంధము లేకుండచేయును. ఈవిధముగా ౧వ దఫాలో ౪వ అవాంతరపుదఫాలను ఈసభవారు ఆమోదించుటవలన, భారతదేశములో యూరపీయప్రజలకు వెంటనే సైనికసేవను నిర్బంధముచేయుశాసనమును చేయుటకును, ఉపద్రవకాలములో, ఇంకను అవసరమైనమార్పులను ఆర్డినెన్సులచే చేసికొనుటకును గవర్నరుజనరలుకు అధికారము యివ్వబడుచున్నది. సైనిక సంబంధమైనట్టియు, సివిల్ సంబంధమైనట్టియు నానాప్రకారముల దేశసేవకు యూరపీయులుతగుదురాయనియు, అంగీకరింతురాయనియు పరీక్షించుటకై ఇదివరలోఒకశాసనముచే గవర్నరుజనరలుఅధికారముపొందిచర్యగైకొనియుండెను. ఇపుడున్న అత్యవసరపరిస్థితులనుబట్టియు, భారతదేశపుసేనలును, మందుసామానుల పరిశ్రమయు చాలఎక్కువగావృద్ధిచేయబడవలసియుండుటవల్లను, ఆశాసనముచే చాలినంతమంది వాలంటీర్లులభించలేదని కనుగొనబడినది. ఇపుడు ఈసభవారిఆమోదములో గవర్నరుజనరలు ప్రవేశపెట్టదలచినఆర్డినెన్సువారలను నిర్బంధముగా రప్పించుకొనుటకు గవర్నరుజనరలుకు అధికారమునొసగుచున్నది.

మొదట ౧౯-ఏండ్లకును ౫౦ఏండ్లకును మధ్యనుండువారలకును పరీక్షకైపిలువవలెనని గవర్నరుజనరలుగారియుద్దేశ్యము. తర్వాతవారలను ఏ పనికినిర్ణయించిన ఆపనిచేయవలెననివారలకు నోటీసులు అందజేయబడును. ఇక సైనికశాఖలోవారలను మొదట భారతదేశమందలి బ్రిటిషుసేనలో చేర్చెదరు. తర్వాత వారలనుఏపనులకు ఎక్కువగా తగుదురో ఆపనులకుపంపెదరు. లేదా ఆఫీసర్లపని నేర్పించేయూనిట్లలోచేర్పించి, తర్వాత ఆఫీసర్లపనులను వారలకిప్పించెదరు. అంతరాత్మలో యిష్టములేనివారికి బ్రిటనులోవలెనేనిర్బంధమును వర్తింపజేయరుకాని వారల అంతరాత్మకు ఏమాత్రముకష్టముకావట్టియు, లేక సైనికోద్యోగములో దగ్గరసంబంధము లేనట్టియు, ఏదో యొక దేశసేవచేయవలసినవిధిమాత్రము తప్పదు. ఈవిషయమున ఈదేశములోవలెనే పరీక్షసేయు మొదటికమిటీవారితీర్పుపై మురాఫా చేసికొనవచ్చును. ఇప్పట్ల చిత్తుశాసనములో కలపెట్టిన చర్య యిది యొక్కటియే. ఈశాసనము సంభవముకాని పరిస్థితిని ఊహించుకొనిచేసినది ఎంతమాత్రముకాదు."

ఉత్తర ప్రత్యుత్తరములకు విఘాతము

ఇక బిల్లులో ముఖ్యలక్షణమును ప్రస్తావించుచు అమెరిగారిట్లు చెప్పిరి, "మనము ఇంతవరకు సంభవించకున్నను ముందు కావచ్చునని తలచవలైన కొన్నిఉపద్రవములు సంభవించకుండ ఏర్పాటు చేయవలసియున్నది. ఇంతవరకు సాధారణ పరిస్థితియనగా, ఈదేశమునకును భారతదేశ

(౧౦వ పేజీచూడుము)

## హైదరాబాదు సాహుకార్లు

హైదరాబాదు(దక్కను)అమర్దాదు ౨౮

హైద్రాబాదు సాహుకార్ల సంఘమువారు యుద్ధమువల్ల సంభవించిన పరిస్థితులను ప్రభుత్వమువారి దృష్టికి తెచ్చుచు రాష్ట్రములో భద్రతలను కాపాడుటకవసరమగు అన్ని విధానాలను అవలంబించవలసినదనిన్ని బ్రిటిషువారికి సాహుకార్లు బాగుగా ఆర్థికసహాయము చేయవలసినదనియు తీర్మానించినారు.

## ఆంధ్రమహాసభ కార్యసంఘము

హైదరాబాదు(దక్కను)అమర్దాదు ౨౮

పైసంఘమువారు మహారాజా సర్ కిషన్ ప్రసాదు బహద్దరుగారియొక్కయు రాజా రామదేవరావు బహద్దరుగారి కుమారులైన రాజా పురందరదేవరావు గారియొక్కయు మరణములకు విచారము తెలుపుచు తీర్మానముచేసినారనియు రైతులకు మాల్గుజారీ సంబంధమగు వ్యవహారములలో ఉచిత న్యాయవాదిసహాయ మిత్తుమనియు, తీర్మానించినారని హైదరాబాదు బుల్లెటిన్ పత్రికలో ౨౭జూన్ గురువారము నాడు ప్రకటింపబడినది.

మరియు నల్లగొండ వకీలు గారగు శ్రీ. వెంకటరామారావుగారిని మహాసభాధ్యక్షులగుశ్రీమం. రామచంద్రరావు గారు కార్యకారిణీ సభ్యునిగా ఏర్పాటు చేసుకొన్నారనియు ఆదే బుల్లెటినువార్త ప్రకటింపబడినది.

(గమనిక — బహుశా ఈ వెంకటరామారావు వకీలుగారు కరీంనగరు వకీలు గారో యేమో? సప్తమ ఆంధ్రమహాసభజరిగి ౨మాసాలు గడచిపోయెను. ఇంతవరకు ఒకసభ్యుడు కార్యకారిణీసంఘములో తక్కువగాయుండెను. ఇప్పుడే అసలాన్ని పూరించినట్లు కనబడుచున్నది. గో.ప.)

దొంగతనము

సికింద్రాబాదులో గతవారము హనుమంతరావు అనువాడు కుటుంబయుక్తముగాసినిమాని చూచుటకు రాత్రిపూట ఆతని యింట్లో యెవరు లేనిదిచూచి ఎవ్వరోదొంగలు ౧౦౦౦ రూపాయీల విలువగలసొత్తులను అపహరించినారు.

## సిమ్లా క్రొత్తపర్మాను

మిషను పనులు తెలిసిన కూలీలతో బలవంతపుపని

యుద్ధావసరములకును ఇండియాలో బలవంతపు దేశసేవానిమిత్తమై యంత్రాలపనులలో చేర్పరులైన కూలీలతో అవసరమునొద్ది బలవంతముగానైనా పనితీసికొనబడునని ౨౮ జూన్ నాడు సిమ్లానుండి ఆర్డినెన్సు అజ్ఞాపింపబడినది, ౮౦౦౦ మంది కూలీలకుపైగా యంత్రాలపనికి అవసరపేర్పడినదట. ఇంతలో ఈ మొత్తాన్ని జత చేయుచున్నారు. ఏదేని యంత్రాగారాలలో ఇట్టికూలీలుందురో అట్టివారిని యంత్రాలయాలయజమానులు అప్పజెప్పవలెను. లేకుంటే ఈ ఫర్మానుననుసరించి వారివద్దనుండి వీరుతీసుకొనబడుదురు. అవసరము పూర్తిఅయిపోయినతర్వాత మరలఆపనివారిని పూర్వపుయజమానులు పనిలోనికి తీసికొనవలసిఉంటుంది.

## నవాబ్ సర్ అక్బర్ నవాజుజంగు బహదర్‌గారి కృతజ్ఞత

హైదరాబాదు(దక్కను),అమర్దాదు ౨౭

సర్ అక్బరుగారికి చాలాతంతులు ఉత్తరాలు తమసతిగారి వియోగమునుగురించి సానుభూతి తెలుపుచు అందజేయబడినవి. వీలైనంతవరకుస్వయముగా చాలామంది స్నేహితులకు కృతజ్ఞతను తెలుపుకున్నారు. ఇంకనుచాలామందికలరు అట్టివారికందరికిని స్వయముగావ్రాయుట సాధ్యముకానిపని. అందుచేత బహిరంగముగా అందరికిని వారుచూపినట్టిప్రేమకు కృతజ్ఞతను నవాబుగారు తెలుపుకొనుచున్నారు.

## ౨౫ ఏండ్లనుండి జర్మనీతో లడాయి

ఇంగ్లాండుకు సమీపంలో “విల్ ఆఫ్ మాన్” “మానవద్వీపము” అను ఒకచిన్నగుడ్డు అంతదీవిగడ్డఉన్నది. ఆదీవిలో ఇంగ్లీషుజనులే ఉన్నారు, వారికిని ఒకవిధమగు స్వాతంత్ర్యమిచ్చినారు. ఆదీవిగడ్డలోనున్న ఒక వైమానికుడు తమదేశజనులు ౧౯౧౪నుండి నేటివరకును జర్మనులపై యుద్ధధ్వజమెత్తి అట్లేఉంచినారని చెప్పినాడు. పిట్టచిన్నదైనా కూతమాత్రం ఘనంగా ఉన్నది. ఆయన ఇంకాఇట్లన్నాడు, “మాకు స్వంతరాజ్యాంగముంది. సొంతపార్లమెంటుఉన్నది. మేము ప్రత్యేక రాష్ట్రమువారంఎప్పుడు బ్రిటన్ యుద్ధంలోచేరితే అదేక్షణము మేమున్ను బ్రిటన్ పక్షంగా యుద్ధంప్రకటించినామన్నమాటే అయితే ౧౯౧౯లో సంధిఅయిపోయినప్పుడు ఉభయవర్గాలు మమ్ముల మరిచిపోయినారు. సంధిపత్రాలమీద మాసంతకాలుండవద్దూమరి. మమ్ములను పిలువకపోయిరి. మాప్రభుత్వం సంతకంచేయలేదు. అందుచేతమేము ఎత్తిన యుద్ధధ్వజం అట్లేఉండింది. మేముప్రత్యేకంగా మళ్లీయుద్ధం ప్రకటించవలసిన పనేలేదు. ౨౫ ఏండ్లనాటి ప్రకటన రద్దుకాలేదు. అందుచేత మేమింకా యుద్ధంచేస్తున్నామన్నమాటే.”

## ఖాక్సారులకు జీన్నా సందేశము

ఖాయదెఅజం జనాబ్ జిన్నాగారు ఖాక్సారునాయకులకు యిట్లుతెలిపినాడు మీరంత బాగా ఆలోచించుకోండి. నామాటవినండి. ముస్లింప్రజలుచాలామంది నాకు జాబులువ్రాసినారు. పంజాబుప్రభుత్వముతో చెప్పి యీసమస్యను పరిష్కరించుమని కోరినారు. ముస్లింలీగు యీవిషయమై ఏమిన్నీచేయకపోయెనని జనులలో విశ్వాసము ముదిరినది. ముసల్మానులెక్కడున్నాసరే తనశక్తికొలది ముస్లింలీగు సహాయముచేయుటకు కంకణముకట్టుకున్నది. నేనుస్వయముగా ఖాక్సారుల యెడనాఅభిమానాన్ని దాపెట్టుకోకుండా వెల్లడించినాను. నాకు ఖాక్సారునాయకులు అధికారమిస్తె చెప్పినట్లుశాసించునాంచే ఈవాదాన్ని పరిష్కరించేదానికి సర్వవిధాలా ప్రయత్నం చేయగలను.

## ఆర్యప్రతినిధి సభ

బాల్యవివాహ నిషేధము సంగీకరించు తీర్మానము కావించినారు.

నిజాంరాజ్యము ఆర్యప్రతినిధిసభయొక్క కార్యకారిణీసభ ౧౬జూన్ నాడు షోలాపూరులో పండిత వినాయకరావు బారిష్టరుగారి అధ్యక్షతలో జరిగెను. ఆరుగంటలకాలమువరకు ముఖ్య సమస్యలపై చర్చ జరిగినపిమ్మట తీర్మానములు గావింపబడెను. అందు ముఖ్యమైనవేమనగా.

(౧) వినరులో అగ్నిదహనము జరిగినతర్వాత హైద్రాబాదులోని ముస్లిం పత్రికలున్ను కొందరు ముస్లిం ప్రముఖులున్ను రాష్ట్రములోని హిందూముస్లిం కలహాలకు పూర్తిగా ఆర్యసమాజమువారే బాధ్యులని ఆర్యసమాజము నపనిందపాలు చేయుచున్నారు. అది పూర్తిగా అబద్ధప్రచారమైయున్నది. ఈసభవారి అభిప్రాయములో ప్రకృతముందు అశాంతికి కేవలము అంజుమనె ఇత్తెహాదుల్ముస్లిమీనున్ను ఖాక్సారు ఉద్యమమున్ను ఆయియున్నది. పత్రికలలోని ఉద్రేకము కలిగించునట్టియు కలహాలను పుట్టించునట్టి వ్రాతలను వార్తలను ప్రభుత్వమువారి దృష్టికి తెచ్చుచున్నారు. హిందూ ముసల్మానులిరువురు ఐకమత్యమును భంగముచేయు అబద్ధపు వార్తలనుండి ఉద్రేకపడకుండా ఉందురు గాక.

(౨) వఖ్తుపత్రిక ప్రకృతము హిందూ ముసల్మానులలో పరస్పరద్వేషము కలిగించుటకై ఉద్దేశించినట్లున్నది. ముందుకాలములో దానివ్రాతలవలన ఆర్యసమాజమువిషయమై ప్రజలలో విరుద్ధాభిప్రాయము కలిగించుటను ఈ సమాజమువారు అసహ్యముతో చూచుచున్నారు. ఆర్యసమాజమువారు హిందూభక్తులను సారము శాంతి ఓర్పు కలిగియుండగలరని కోరుచున్నాము.

(౩) ఈసభ ఆర్యసమాజ శాఖలవారందరును సంస్కారప్రియులందరును బాల్యవివాహనిషేధ శాసనానికి అనుకూలముగా అభిప్రాయమిత్తురని కోరుచున్నారు. ప్రజలలోను దీనికి అనుకూల వాతావరణమును కలిగింతురు గాక. నిజాంరాష్ట్రములోని అన్ని ఆర్యసమాజాలకు ప్రతినిధియైనయీసభ యీశాసనానికి సంపూర్ణముగా అనుకూలాభిప్రాయ మిచ్చుచున్నది.

హైద్రాబాదు రాష్ట్రములో వైదిక ప్రచారానికి ఒక మంచి ప్రణాళిక సిద్ధముచేయవలెను. ౧౯౪౧ జఫ్తాభా సంవత్సరానికిగాను ఒక కార్యాలయము హైద్రాబాదునగరములో ఏర్పాటు చేయవలెను. ఆర్యప్రతినిధి సభయొక్క వార్షికోత్సవము ౧౨జూలై ౧౯౪౦తేది నిర్ణయింపబడినది.

ఆర్యసత్యాగ్రహ సమితివారు హైద్రాబాదులో ఒక ఉన్నతపాఠశాల స్థాపించుటకై కోరియుండిరి. ౨౦జూలైనాడు ఆర్యజగతిలో పూజ్యనాయకులైన గౌరవనీయులగు ఘనశ్యామసింహుగారిచేత శంఖుస్థాపన గావింపబడును. హైస్కూలునుసడుపుటకు ౧౧మందిసభ్యులుగల ఒకసమితిని ఏర్పాటుచేయబడినది.

(ముఖీతెదక్కన్)

## పిస్టల్సు

హైదరాబాదు(దక్కను) అమర్దాదు ౨౮

కాలపరిస్థితులనుబట్టి నగరములో ఏయేపిస్టల్లు, రివాల్వర్లు గిరవుగా ఉంచబడినవో అవన్నీ ౧౫ దినాలలోగా పోలీసు కార్యాలయకచ్చేరీలో దాఖల్ చేయవలెనని పోలీసుఆజ్ఞ అయినది.

## మచిలీబందర్ కావాలె

హైదరాబాదు (దక్కను)
అమర్దాదు ౨౮

హైద్రాబాదు యూత్ లీగుఅను ఇంగ్లీషు నామకరణముగల ఒక సంఘమును ఇటీవల కొందరు చేరి ఏర్పాటుచేసుకొన్నారు. “వారి “కౌన్సిల్” ౨౬జూన్ నాడు హైద్రాబాదులో సమావేశమైనది, అందు కొన్ని తీర్మానాలు చేసినారు, అందు మచిలీపట్నంను గురించినది చాలాముఖ్యమైనది, ఇంగ్లాండుదేశానికి ఈ యుద్ధములో హైద్రాబాదు అన్నివిధాలా సహాయము చేయుచున్నది. ఈసమయములో హిందూదేశముపై దాడిజరుగు భయము సంభవించినది, అందుచేత విమానాలు నావ రెక్కువగా సిద్ధముచేయవలసిఉంటునది. పూర్వము ఇంగ్లీషువారు సైన్యముఖర్చులకుగాను తమస్నేహితుడగు నిజాంనుండి మచిలీబందరును తీసుకొనియుండిరి ఇప్పుడు మరల దానిని వాపసుయిస్తు యుద్ధంలో యింకా యెక్కువ సహాయంకాగలదు.

## లేడిహైద్రీ స్మారక సభలు

హైదరాబాదు (దక్కను) అమర్దాదు ౨౦

హైద్రాబాదు స్త్రీలసంఘమువారు చేసిన సభలో ౧౨౦౦ మందికిపైగావచ్చియుండిరి, కొందరు బేగములుకూడ విచ్చేసియుండిరి. రాణీలును వచ్చియుండిరి. ఇంగ్లీషులేడీలునువచ్చియుండిరి. రాణిముక్రేషియ్యార్ దుర్దానాబేగంసాహెబాగారు తాముసభకురాలేననివార్తపంపిరి. అదేవిధము రాణీనీలోఫర్ ఫరహాత్ బేగంసాహెబాగారువార్తపంపుచ లేడీహైదరీగారికి స్మారకచిహ్నమును నిర్మించవలెనని తెలిపిరి, గిడ్నీసతిగారును తమసందేశమునుపంపిరి. తర్వాత విషాద తీర్మానమును సభవారు గావించిరి.

న్యాయశాఖామంత్రి పర్యటన

హైదరాబాదు(దక్కను)అమర్దాదు ౨౭

గౌ॥ సయ్యద్ అబ్దుల్ అజీజు గారు మొన్న శుక్రవారమునాడు నిజామాబాదుజిల్లాలో పర్యటనార్థమై వెళ్లినారు. వారీసందర్భములో జిల్లాలోని కోర్టులను పరిశీలించెదరు.

## బర్లిన్ రేడియో అబద్ధపు వార్తలు

హైదరాబాదు (దక్కను).
అమర్దాదు ౨౮.

ప్రభుత్వప్రకటన శాఖవారిక్రింది విషయాన్ని ప్రకటనార్థమంపినారు,

ఇస్తాంబూల్‌లోని “అక్శాం” అనే పత్రిక ౨౬-౬-౪౦నాడు ఇట్లువ్రాసినది.

బర్లిన్‌లో అబద్ధము ప్రచారం విపరీతంగా ఉంది. వారట్లన్నారు. “తుర్కీ బ్రిటనుతో కలిసింది. అందుచేత భూకంపాలు అట్టి యితర అపాయాలు కలిగినవి. ఇవి దైవ సూచనలు. తుర్కీ చర్యలు దైవానుగ్రహానికి పాత్రం కాలేదు” ఇట్టి పిచ్చివార్తలనువిని అందరును నవ్వుతారు. బర్లిన్‌లో ఇట్టిచెత్తమాటలు మాట్లాడేవారున్నారని మాకు ఆశ్చర్యము కలుగుచున్నది.

ఇటీవల తుర్కీలో పెట్రోలుబావులు దొరికినవి. ఇందువల్ల దైవము మాపై ఆగ్రహము చూపలేదన్నమాట. కావున దైవమే బర్లిన్ రేడియో జవాబిచ్చినది.

## దక్షిణంలో మిత్రమండలి యెందుకు సైన్యాలను ఉంచినారు?

హైదరాబాదు(దక్కను),
అమర్దాదు ౨౮

ప్రభుత్వప్రకటన శాఖవారు మాకీక్రిందివార్త ప్రకటనార్థమంపినారు,

౨౫ఏప్రెల్ తంనాడు ఇస్తంబూల్ నగరములో “టాన్”అనే పత్రికలో యిట్లువ్రాసినారు.

కొన్ని నెలలనుండి సైన్యము విషయమై అంచనాలు వేయుచున్నారు. జర్మనులప్రకారము మిత్రమండలివారు రష్యాపై కాకేసస్‌ద్వారా దండెత్తనున్నారట. జర్మనీ తుర్కీని విరోధియగుటకై యత్నించుచున్నది. సిరియాలో వేగాన్‌క్రింద తెలక్షల సేనఉన్నది. ఈ సైన్యము సూయజ్ కాలువను, ఈజిప్టును సూడానును రక్షించుచున్నది అవసరంపడితే బాల్కన్ రాజ్యాలకు సైన్యము సహాయముచేయనున్నది. ఇటలీ ఇటీవల ఫ్రాన్సు, బెల్జియములకు వ్యతిరేకముగా వర్తించుకొనుచున్నది. వెన్నరుకనుమవద్ద హిట్లరుతో ముసలోనీ కలిసినప్పుడు బాల్కను రాజ్యాల విషయమై ఆలోచించుకొన్నారని తెలిసినది. అయినా ఈ సైన్యమున్నందున ముసలోని తనయిష్టమువచ్చినట్లు చేయజాలడు.

## దయానంద వైది కాలేజ్ పాఠశాల

హైదరాబాదు (దక్కను),
అమర్దాదు ౨౮

ఇది క్రొత్తగాఆర్య సమాజమువారిచే హైద్రాబాదునగరములో స్థాపింపబడనున్నది. ౨౦జూలైనాడు ఘనశ్యామగుప్తగారు దాని ప్రారంభోత్సవము జరుపుదురు. మొదలు ఇది మాధ్యమికపాఠశాలగానుండును. తర్వాత హైస్కూలుగామారును. మద్రాసు విద్యాపీఠముతో సంబంధ ముంచుకొనును.

## పరువాకపున్నమ

(స్వ.వి.)

మహబూబునగరం. అమర్దాదు ౧౫

శ్రీ తిరుమలనాథస్వామి గారి దేవాలయము దగ్గర సాయంత్రి నాలుగుగంటల నుండి బండ్లు తిరుమబడెను, చాలవరకు వైశ్యులు, శూద్రులు భిన్న జాతివారు సమావేశమైయుండిరి. కనీసము మూడువందలకుపైగా జనము వచ్చియుండెను, గత సంవత్సరమునకన్న ఈసంవత్సరపు దృశ్యము దీన స్థితిగానేయుండెను. కొందరు దేవతాదర్శనమునకు వచ్చియుండిరి. ఆజనమంత నల్లగావి మఃతినీళ్ల హౌజు చూచుటకు వెళ్లుచుండెను.

రాత్రి ౧౦గంటలకు కోమూరు బట్టాజి గారి హరికథ దేవాలయమువద్ద జరిపిరి. గుట్టప్రదేశము గ్రామమునకు దూరముగావున్నను జనము వినుటకు బాగుగనే వచ్చియుండెను.

---

## వనపర్తి మున్సిఫ్

హైదరాబాదు (దక్కన్), అమర్దాదు ౨౦

రెండువారాలక్రిందట వనపర్తి సంస్థానము మున్సిఫ్ పదవిపై నియమించుకున్న లక్ష్మీకాంతరెడ్డి గారిస్థానములో ఆగారెడ్డి బి. ఏ. ఎల్. ఎల్. బి. గారు హైకోర్టువారిచేనియమింపబడిరి వారువనపర్తిలో పదవిని స్వీకరించినారు.

---

## అ. భా. సం. ముస్లింలీగు

అఖిలభారత దేశీయసంస్థాన ముస్లింలీగు యొక్క కార్యకారిణీ సభ సమావేశము ౨౫ జూలై ౧౯౪౦నాడు హైద్రాబాదు (దక్కన్)నగరములో జరుగును. ఆసభలో యుద్ధసంఘాలు, సంస్థానాల ముసల్మానులు పాల్గొనువిషయము ఆలోచించబడును. ముందుకాలములో దేశీయ సంస్థానముల అస్తిత్వమునుగురించియు వాటిక జ్ఞానుగురించి ఇటీవల కాంగ్రెసులీడర్లు ఇచ్చిన అభిప్రాయాలయొక్క విమర్శకూడా చేయబడును.

---

## విండ్జర్ ప్రభువు

విండ్జర్ ప్రభువుగారున్న వారిభార్యయున్న ఇంతలోఇంగ్లాండు చేరుకొనున్నారు, ఇప్పుడు వారుస్పెయినులోని బార్సిలోనియా పట్నంలో ఉన్నారు వారుఫ్రాన్సులో నుండినట్టి భవనం యొక్క తాళముచెవులు అమెరికారాయభారికిచ్చివేసినామని తెలిపినారు, ఇంగ్లాండువచ్చినతర్వాత ముందేమిచేయునిశ్చయించినారో ఇంకను నిర్ణయించుకోలేదనియు తెలిపినారు.

---

## కూచ్ బిహార్ యువరాజు

మోటారు ప్రమాదము

హైద్రాబాదువద్దనున్న బొలారములో సైన్యశాఖయందు అధికారిగానున్న కూచ్‌బిహారు రాణీ యొక్క రెండవకుమారుడైన ఇందర్‌జీత్‌సింగు అనువారుతమమోటారును స్వయముగా ఆదివారమునాడురాత్రి ౧౧॥ గంటలకునడుపుకొనిపోవుచు బొలారమురోడ్డులో ఒకరాతిస్తంభాని కిఢీకొన్నారు. మోటారు తుత్తునియలయ్యెను. ఇందర్‌సింగుగారికి నెత్తిపై బలమైనగాయాలు తగిలెను. స్మృతితప్పిపడిపోయెను తిరుమలగిరి అస్పత్రికితీసికొనిపోయి చికిత్సచేయించుచున్నారు.

---

## రూపాయిల అదేపనిగా జమాచేయకూడదు

బ్రిటిషుఇండియా ప్రభుత్వమువారు రక్షణ శాసనములోనుఒకకొత్తసవరణనుచేసినారు. ఎవ్వరైనాకాని యికముందు తమఅవసరాలకంటే యెక్కువగానోట్లను విడిపించుకొని రూపాయీలను జమాచేసుకొనగూడదు. అవసరాలకంటే ఎక్కువగా ఒకనివద్ద రూపాయీలు వున్నవాలేవాఅనే విషయాన్ని రిజర్వుబెంకువారుకాని లేక వారుయేజంట్లుకాని నిర్ణయముచేయగలరు. ఇట్టిశాసనము ఎందుకుచేసినారంటే జనులుఅదేపనిగా రూపాయీలను కూడబెట్టుకుంటూపోయిన సంఘానికంతా పెద్దదెబ్బతగులుతుంది.

ఎవ్వరైతే ఈశాసనానికి విరుద్ధముగా వర్తించుకుంటారో అట్టివారిపై ౫ ఏండ్లవరకు జెయిలు శిక్షయున్న ఉపరిజుర్మానాయున్ను మోపబడును.

---

## బొంబాయిని దాడికి సిద్ధపరచుట

బొంబాయిపై గ్రహచారముచాలక శత్రువిమానాలదాడివచ్చినట్లయితే జనులు భయపడకుండ యెట్లుతప్పించుకొనవలెనో ఆవిధాణన్ని సాధించినారు. ౨౫ జూన్‌నాడు ప్రొద్దున ౧౧-౪ గంటలకు విమానాలదాడి వచ్చిందని గంటలు కొట్టినారు. వెంటనేనగరమంతా ఎక్కడివారక్కడనిలిచిపోయినారు. మిలిటరీ విమానాలు నగరముపై అరగంట తిరుగుచు జనులెట్లువర్తించుకున్నారో పరీక్షించినారు. జనులకుబోధకాంగాఒంటబట్టినదని తెలుసుకున్నారు అర్ధగంట తర్వాత మరలగంటలుకొట్టినారు. జనులు యథాప్రకారము వ్యవహారాలలో నిమగ్నులైనారు.

---

## ఇండియాలో నౌకానిర్మాణము

విశాఖపట్టణము ఓడరేవులో పెద్దపెద్దఓడలు నిర్మించుటకై బ్రిటిషుప్రభుత్వమువారేర్పాట్లుచేయుచున్నారు. అందుకై వ్యాపారశాఖామంత్రిగారగు సర్.ఏ. రామస్వామి మొదలియారుగారు విశాఖపట్నంవెళ్లియుండిరి. ఈ నిర్మాణకార్యాన్ని ఒకహిందూస్థానీ కంపెనీకి గుత్తకియ్యనున్నారు. పనివారియిండ్లకు కావలసినస్థలాన్ని తీసుకొనుచున్నారు. పనికవసరమగు రైల్వేలైను, విద్యుత్తు సామానుసౌకర్యాలు ప్రభుత్వమువారు కలిగింతురు.

---

# ఫ్రెంచియుద్ధనౌకల సంపాదనకై బ్రిటిషువారు యత్నించినవిధము

## ఫ్రెంచిసామ్రాజ్యముపై బ్రిటిషువారి ఆశ

## పత్రికల స్వాతంత్ర్య రక్షణకై బ్రిటను ఏర్పాట్లు

౧౯౪౦ జూను ౨౫వ తేదినాడు బ్రిటిషుపార్లమెంటు కామన్సుసభలో ప్రధానమంత్రి విన్స్టన్‌గారు యుద్ధమునుగూర్చి గావించిన ప్రకటన ఫ్రాన్సు జర్మనీకిలొంగుట ఎట్లు ప్రారంభమై ఎట్లు అంతమయ్యెనో, ఈమధ్యకాలమున ఫ్రాన్సుప్రభుత్వమునకును బ్రిటిషు ప్రభుత్వమునకును ఏమేమి ఉత్తరప్రత్యుత్తరములు నడచెనో కొద్దిగా బయటపెట్టెను. చర్చిల్‌గారు బయటపెట్టిన సమాచారమంతయు ఫ్రెంచిప్రభుత్వము జర్మనీకి లొంగుచో ఫ్రెంచివారి యుద్ధనౌకాబలమును రాబట్టుకొనుటకై బ్రిటిషు ప్రభుత్వమువారు చేసిన యత్నమునకు సంబంధించినది.

ఫ్రాన్సు ఓడించబడుననియు, తర్వాత శత్రువుకు లొంగవలసివచ్చుననియు విశదమైనపుడు, ఎన్నెన్నియో ఆశలకు ఆలవాలముగ భావించుచుండిన మంచిసేన జర్మనులదాడిక్రింద నిలవలేక పడిపోవుచుండగా, ధైర్యశాలియైన ఫ్రెంచిప్రధాని రేనాగారు నన్ను టూర్సువద్ద తనను కలిసికొనవలసినదిగ కోరెను. నేను ఆదేశప్రకారము విదేశాంగశాఖ మంత్రితోను విమానోత్పత్తిశాఖ మంత్రియగు లార్డుబీవర్ బ్రూకు గారితోను కలిసి జూను ౧౩వ తేదినాడు వారిని కలిసికొంటిని.

* * *

### రేనాగారి కోరిక

"మార్షల్ రేనాగారు యుద్ధరంగ స్థితిని ఫ్రెంచిసేనయొక్క స్థితిని విశదముచేసినతర్వాత, తన బ్రిటిషుమిత్రముయొక్క అంగీకారములేకుండ యుద్ధవిరామమునకుగాని, సంధికిగాని ప్రయత్నించరాదను నిర్బంధమునుండి ఫ్రాన్సును గ్రేటుబ్రిటను విడుదలచేయుట కిష్టపడునా అని అడిగిరి. ఫ్రాన్సులో యుద్ధరంగముయొక్క స్థితియు నాకు చక్కగా పరిచితమే. ఫ్రాన్సు ఎంతబాధపడినదియు, మనము యింతవరకు అంతబాధపడలేదనియు నాకు తెలియును. అయినను, అట్లు రేనాగారు అడిగినదానికి నేను ఒప్పుకొనలేకపోతిని. కాని మనమింకను భరించవలసినవియుండగా ఒకరినొకరము ఆక్షేపించుకొనుచుండుటవలన ప్రయోజనములేదు. రేనాగారు అమెరికాకు మరియొకసారి విన్నవించుకొనవలెననియు, అందుకువచ్చు సమాధానమును చూచి తర్వాతకూడ రేనాగారు యుద్ధము సాగించజాలనిచో, మేము మరియొకసారి సమావేశమై అప్పటికి క్రొత్తగానుండు పరిస్థితులనుబట్టి నిర్ణయము చేసికొనదగుననియు — మేము పరస్పరము ఒప్పుకొంటిమి.

అదివరకే బోర్డియోకు పోయియుండిన రేనాగారు వ్రాసినలేఖ నాకు జూను ౧౬వ తేదినాడు చేరెను. అందులో అమెరికానుండి వచ్చిన సమాధానము సంతృప్తికరముగ లేదని చెప్పిన తర్వాత, ఇంగ్లాండు ఫ్రాన్సుల ఒడంబడిక ప్రకారము ఉండెడి నిర్బంధమునుండి ఫ్రాన్సును విడుదలచేయవలసిన దిగా కోరబడెను. వెంటనే మంత్రివర్గము సమావేశమయ్యెను. మేము సమాధానమును పంపితిమి. దానిని పూర్తిగా వినిపించక, దాని ముఖ్యసారమును చెప్పెదను. యుద్ధవిరామముకొరకుగాని, సంధికైగాని వేరుగా యత్నించవలచుచో, అందుకు ఏసమయమునగాని అధికారమందుండు ప్రభుత్వముతోగాని, పాలకులతోగాని చేసికొన్న ఒడంబడికగాక ఫ్రెంచి రిపబ్లిక్కుతో చేసికొన్న ఒడంబడిక ఒప్పుకొనవలసియుండును. కొంబట్టి ఆట్టిప్రయత్నములు ఫ్రాన్సుయొక్క ప్రతిష్ఠతో సంబంధించియుండును. అయినను అప్పుడు మంచియుండిన దాని సంగతి యు వారలుపడిన బాధలన్నిటిని వారికె ప్రస్తుతముగ నున్నట్లు స్పష్టముగనుండిన శక్తులను గమనించినతర్వాత ఫ్రెంచినౌకాబలమును బ్రిటిషురేవులకుపంపి, వాటిని సంభాషణలు పూర్తియగునంతవరకు అక్కడనే యుంచుచో, ఎట్టిషరతులపై యుద్ధవిరామమునకు తామంగీకరించవచ్చునని తెలియజేసితిమి. బ్రిటిషుప్రభుత్వము యుద్ధమును సాగించుటకును, యుద్ధవిరామమునుగూర్చిన ఎట్టి విచారణలతోగాని సంబంధమును లేకుండ తప్పించుకొనుటకును నిశ్చయించి కలిగియున్నారనికూడ స్పష్టపరచితిమి.

### రేనాగారి నిష్క్రమణము

"ఆదేసాయంకాలము అనగా ౧౬వ తేది, నేను రేనాగారి ఆహ్వానముపై వారిని చూడబోవుటకు సిద్ధమగుచు, రైలుకూడ ఎక్కితిని. అప్పుడు రేనాగారు తొలగించబడిరనియు మార్షల్ పెటెయిన్‌గారిక్రింద క్రొత్తప్రభుత్వము ముఖ్యముగా జర్మనీతో యుద్ధవిరామమునుకూర్చి సంభాషించుటకొరకే ఏర్పాటు చేయబడెననియు వార్తనువింటిని. ఈపరిస్థితులలో మేము ఫ్రెంచినౌకాబలమును రాబట్టుకొనుటకు తగిన యేర్పాట్లు చేయుటకు మాచేతనైనదంతయు చేసితిమి. ఫ్రాన్సు ప్రభుత్వమును ఒడంబడికభారమునుండి విడుదలచేయుటకు ముఖ్యమైనషరతు, అనగా నౌకలను బ్రిటిషురేవులకుపంపుట, పూర్తిచేయబడలేదని మేము క్రొత్తప్రభుత్వమునకు జ్ఞాపకముచేసితిమి. అట్లు పూర్తిచేయుటకు కావలసినంత గడువుండెను. దానివలన సంధియత్నములకెట్టి బాధయు ఉండెడిదికాదు. అట్లుచేసియుండిన సంధిషరతులు ఇప్పటికంటె ఏమాత్రముగాని ఎక్కువ కఠినములై యుండెడివికావు. నిజముగా మాకట్టి అభిప్రాయముండెనని నిరూపించుటకై క్రొత్త మంత్రివర్గముతో వీలైనంతవరకు కలియుటకు మేము ముఖ్యులు పీలార్డును, ఫస్టులార్డును, లార్డు లాయిడ్‌గారిని పంపితిమి.

అంతయు లొంగిపోవుచుండెను. కాని నౌకాదళము జర్మనులచేతుల కేగదని ... ఎన్నియో వాగ్దానములు ... కాని నేను సంధిషరతులను చదివినప్పుడు ప్రభుత్వముచెప్పిన... లో చెప్పినట్లు నాకు దుఃఖము, విస్మయము కలిగినవి. ఫ్రెంచిప్రభుత్వమువారు అంగీకరించిన రావ సంధిషరతులలో చెప్పియున్నదేమనగా, ఫ్రెంచివారి కాలనీల సామ్రాజ్యము యొక్క క్షేమమును రక్షించుటకు కొంతనౌకాబలము వదలబడునే గాని ఆదితప్ప తక్కిన నౌకాబలమంతయు చెప్పిన రేవులకుచేర్చి జర్మనులయొక్కయు ఇటాలీయులయొక్కయు పెత్తనముక్రింద దానిని నిరాయుధముగ చేయవలెను. దీనిని బట్టిచూచినచో, ఈ ఫ్రెంచియుద్ధనౌకలు సంపూర్ణముగ ఆయుధపరికరములతోనే జర్మనులయొక్కయో లేక ఇటాలీయులయొక్కయో వశమగునని స్పష్టమైనది. ఆదేషరతులో జర్మను ప్రభుత్వము తమను ఆనౌకలను యుద్ధములో తమఅవసరములకై వినియోగించుకొనవలెననే తలంపులేదని చేసిన ప్రకటనలో ఉన్న సంగతి మనకు తెలియును. కాని దానిప్రయోజనమేమిటి? జర్మనుప్రభుత్వము ఇచ్చిన అటువంటి పవిత్రవాగ్దానములవిలువ ఏమిటని ఆ దేశములను అడిగి కనుగొనుడు. మరియు నావ షరతుప్రకారమే; సముద్రతీర భాగమును కాపాడుచుండుటకును మందుగనులను తీసివేయుచుండుటకును అవసరమైననౌకలను అట్టి వాగ్దానములవల్ల బాధలేదు. ఈఏర్పాటు ప్రకారము జర్మనుప్రభుత్వము సముద్రతీరప్రదేశముల కాపలాకని చెప్పుచు కొన్నియుద్ధనావలను వశములో నుంచుకొనవచ్చును. ఆఖరుకు, ఈ షరతులను ఫ్రెంచివారు సరిగా అమలుచేయుటలేదని సాకుచెప్పి, దానిని త్రోసివేయవచ్చును. జర్మనీకిని ఫ్రాన్సుకును పూర్తిగా సంధివ్రాసికొను సమయమువచ్చినప్పుడు జర్మనులు ఇంకను ఎక్కువకోరికలు కోరవచ్చునని

(౪వ పేజీ చూడుము)

## ఫ్రెంచి యుద్ధనౌకల సంపాదనకై బ్రిటిషువారు యత్నించినవిధము

(౭వ పేజీ తరువాయి)

యుద్ధవిరామపు షరతులలో స్పష్టముగా ఉన్నది. ఇదిసంగ్రహముగా ఈవిషాదకరమైన ఎన్నటికిని మఱపునకు రాదగనికథ.

* * *

**భవిష్యత్తు**

"ఇప్పుడు పరిస్థితి చాల అనిశ్చితముగాను, అగోచరముగానుఉన్నది. అందువలన ముందు ఏమగునుఅని నిర్ధారణగా చెప్పుటగాని ఊహించుటగాని ప్రజాక్షేమమునకు విరుద్ధము." అని చర్చిల్ గారుచెప్పిరి.

**ఫలితము**

"ఫ్రెంచియుద్ధ నౌకాబలమునకు మూడినగతి గ్రేట్‌బ్రిటను యొక్కయు, బ్రిటిషుసామ్రాజ్యము యొక్కయు క్షేమానికి నిర్ధారణగాకున్నను చాలమట్టుకు బాధ కలుగజేయుగలదియే." అని చెప్పిరి.

**ఫ్రెంచి ప్రభుత్వముతో సంబంధము**

ఇప్పుడు బోర్డియోలోనున్న ఫ్రెంచి ప్రభుత్వముతో బ్రిటిషుప్రభుత్వము ఎట్టిసంబంధము గలిగి యుండుననువిషయమున చర్చిల్‌గారిట్లు చెప్పిరి. బోర్డియోప్రభుత్వముతో మాకెట్టిసంబంధముండగలదో నేనిపుడు చెప్పజాలను. వారలు శత్రువు యొక్కచేతిలోచిక్కి పూర్తిగా వారలవశములోనున్నారు. అతడు బెదరింపులతోగాని లేక ప్రచారముతోగాని మా సంబంధములను నిల్పకొనుట కష్టమగునట్లుచేయుటకు జర్మనులకనుకూలురగు మంత్రులను ఏర్పాటుచేయించిగాని ఏమైనను చేయవచ్చును. శత్రువుఆక్రమించని ఫ్రాన్సు అనబడునది చాల కొద్దిప్రదేశము. అక్కడ బ్రిటిషుప్రతినిధిని ఒకరిని ఉంచనిత్తురో లేదో మాకు తెలియదు. ఎందుకనగా, అది పూర్తిగా శత్రువుచేచుట్టబడి శత్రువు యొక్క వశములో నున్నది. అయినను ఫ్రెంచిప్రజల యథార్థప్రకృతిని. వాస్తవసమాచారములను వారలకు తెలియనిచ్చినతర్వాత ఏమిజరిగెనను విషయముపై వారల అభిప్రాయమునునమ్మి, వారల చెలిసాలకిమ్ములగుండా ఎట్టిసంబంధము సాధ్యమగునో అట్టిదానినిఉంచుకొనుటకు యత్నింతుము."

**ఫ్రెంచి సామ్రాజ్య సహకారముపై ఆశ**

ఫ్రెంచిప్రభుత్వము శత్రువులకులొంగిపోయినను ఫ్రెంచిసామ్రాజ్యము తమకు సహకారము చేయవచ్చునని ఆశించుచు, చర్చిల్‌గారిట్లుచెప్పిరి: "ప్రపంచవ్యాప్తమై, ఇప్పటికిని నౌకాబల రక్షితమైన ఫ్రెంచిసామ్రాజ్యము తమ మిత్రులతో కలిసి పోరాటమును ఇంకను సాగించగలదని మా ఆశయైయున్నది. ఈసామ్రాజ్యములో ఒక ఫ్రెంచి ప్రభుత్వము ఉదయించి విజయమునకై పట్టుదలతో కృషిచేసి. స్వాతంత్ర్యసాధకములగు సేనలను ఏర్పాటుచేయుగాకయని మా ఆశ. ఈవిషయములు ఫ్రెంచివారలు మాత్రమే నిశ్చయించుకొనదగినవి. ఫ్రాన్సుయొక్క క్షేమమునకును ఆత్మకును బోర్డియోలో ప్రభుత్వముచేసిన నిరుత్సాహనిర్ణయముకంటె మరియొకటి తగినదిలేదని మేము అంగీకరించజాలము. శత్రువుకు లొంగిని ప్రదేశములోకి ఫ్రెంచివారలు ఫ్రాన్సు స్వాతంత్ర్యముకొరకును, పూర్వస్థితిని సాధించుటకొరకును నాజీ జర్మనీ క్రౌర్యమును ఓడించుటకును పనిచేయుటకు ఉద్యుక్తులైనచో మేముతప్పకుండ మాశక్తికొలది, మాకున్నంతమట్టుకు సహాయము చేయగలము."

**రీనాడ్‌గారెక్కడ?**

ఫ్రాన్సు జర్మనీతో. యుద్ధవిరామయత్నము ప్రారంభించుటకు పూర్వము ఆదేశప్రధానిగనుండిన రీనాడుగారు జూను ౧౯వ తేదినాడు ఉదయము బోర్డియోలో క్రొత్తప్రభుత్వపు ప్రధానియగు మార్షల్ పెటెయిన్‌గారితో సంభాషించినటుల వార్తవచ్చినది కాబట్టి రీనాడ్‌గారు ఇంకను ఫ్రాన్సులోఉన్నట్లు తేలినది. వారేమిసంభాషించిరో తెలియదు అప్పటికి ఇంకను జర్మను ప్రతినిధులతో ఫ్రెంచిప్రతినిధుల యుద్ధవిరామపు షరతులనుగూర్చి రాయబారములు సేయుచుండిరి.

**జనరల్ డీగాల్‌గారికి ఉద్వాసన**

రీనాడుగారి మంత్రివర్గముండినపుడు సైనికచర్యల ప్రధానాధికారి (చీఫ్ఆఫ్ మిలిటరీ ఆపరేషన్స్)గానుండిన జనరల్ డీగాల్‌గారు లండనునుండి చేసిన బ్రాడ్‌కాస్టులో ఫ్రెంచిజనులు ఇంకను జర్మనులతో పోరాడుచుండవలసినదని ప్రచారముచేయుటచే క్రొత్తఫ్రెంచిమంత్రివర్గము డీగాల్‌గారి అధికారమును తొలగించివేసినట్లు జూను ౨౩వతేదినాటి వార్తలోగలదు.

## సివిల్‌సర్వీసు పరీక్షలు

ఈతడవ ఇండియన్ సివిల్‌సర్వీసు పరీక్షలు ౧జనవరి ౧౯౪౧లో ఢిల్లీలో జరుగును. అందు చేరువారు హైద్రాబాదు రెసిడెన్సీద్వారా ౧౫ జూలై ౧౯౪౦లోగా దరఖాస్తులు పంపుకొనవలెను.

**పార్లమెంటు లార్డ్సుసభలో ప్రకటన**

చర్చిలుగారు పార్లమెంటు కామన్సుసభలో చేసినట్టి ప్రకటననే కాల్డికోటుగారు లార్డ్సుసభలో జూను ౨౫వ తేదినాడు గావించిరి.

**బ్రిటిషు ప్రజాభిప్రాయ బలమును రక్షించు ఏర్పాట్లు**

కామన్సుసభలో చర్చిల్‌గారి ఉపన్యాసానంతరము హోర్‌బెలిషాగారు ఫ్రాన్సులో యుద్ధసమయములో పార్లమెంటు సభాసమావేశములు జరుగుచు, పత్రికలు ప్రజాభిప్రాయమును ప్రభుత్వమువారికి వ్యక్తపరచుచుండుటకు పూర్తి అవకాశము ఉండినచో, ఫ్రాన్సుశత్రువులకులొంగియుండెడిదికాదనియు, కాబట్టి బ్రిటనులోకూడ ఫ్రాన్సులోజరిగిన ఈరెండులోపములు జరుగకుండ, ఇప్పటి కష్టకాలములో పార్లమెంటు సమావేశములు నిరంతరము జరుగుచుండునట్లును, ప్రజాభిప్రాయము ప్రభుత్వమునకు వ్యక్తమగుటకై పత్రికల స్వాతంత్ర్యమునకు భంగములేకుండునట్లును ప్రధానమంత్రిగారు వాగ్దానము చేయవలెననియు చెప్పిరి.

అందుకు చర్చిల్‌గారు సమాధానమిచ్చుచు, "ఫ్రాన్సులో జర్మనుసేనలదాడివల్ల ప్రభుత్వవర్గము, పత్రికలు తమ స్వస్థానములను వదలిపోవలసివచ్చెను. ఈదేశములో పత్రికలకుగాని, పార్లమెంటు సభ్యులకుగాని ఇట్టిస్థితి కలుగకుండునట్లు ప్రభుత్వమువారు తగుఏర్పాట్లు గావించుచున్నారు. ఈఏర్పాట్లను అమలులో నుంచవలసిన అవసరమేర్పడదనియే నాతలంపు. అయినను అట్టి అవసరమేర్పడినచో, ఈ ఏర్పాట్లన్నియు అమలులో నుంచబడుననియు, పార్లమెంటుసభలు తమబాధ్యతలను నిర్వర్తించుటకును, పత్రికలు ప్రజాభిప్రాయమును వ్యక్తపరచుటకును, ఈ ఏర్పాటులవల్ల పూర్తిఅవకాశ మేర్పడగలదనియు సభ్యులు నమ్మకము గలిగియుండవచ్చును.

## దేశరక్షక పరిశ్రమల విషయము ఉదాసీనత

### భారతప్రభుత్వమువారిపై ఆక్షేపణ

### వాల్‌ చందు హీరాచందుగారి ప్రకటన

సిమ్లా, జూను ౨౮

భారతప్రజల క్షేమమునకై పరిశ్రమలు ప్రారంభించుప్రయత్నము నిజముగాజరుగవలసినచో కేంద్రమున జాతీయప్రభుత్వమేర్పడవలెనని వాల్‌చందు హీరాచందుగారు చెప్పిరి. ఈకోటీశ్వరుడు నౌకామహాసభకుగాను సిమ్లాకువచ్చియుండెను: బొంబాయినుండి వెళ్లిపోవుటకు పూర్వము ఆయన ఈక్రిందిప్రకటనగావించెను:-

ప్రపంచము, భారతదేశము చాలకష్టకాలములోనున్నను భారతదేశములో పరిశ్రమలను ప్రారంభించువిషయమై భారతదేశ ప్రభుత్వమువారు ఉదాసీనభావము, నిర్లక్ష్యభావము కనబరుచుచున్నారు, భారతదేశ పరిశ్రమలనగా భారతీయుల పెట్టుబడితో నడుపబడి భారతీయుల పరిపాలనక్రిందనున్న పరిశ్రమలని నాయర్థము, భారతదేశ పరిశ్రమలను వృద్ధిచేయుటకు యుద్ధము అవకాశము గలుగజేసెను. ముఖ్యవస్తువుల విషయమై భారతదేశముయితరదేశములపై నాధారపడకుండ చేయుటకు భారత ప్రభుత్వమువారికి మంచి అవకాశము కలిగెను. యుద్ధము ప్రారంభమైనప్పటి నుండియు పారిశ్రామికాభివృద్ధివిషయమై మాటలు వినుచున్నాము గాని నిజమైనపనియేమియు కనబడుటలేదు, కమిటీలయేర్పాటుసభలు విస్తారముగా జరుగుటయే గాని అవసరమైనపని కనబడుటలేదు.

ఈదేశములో విమానములను తయారుచేయవలెననియు, ప్రతిసంవత్సరము కొన్నివిమానములను భారతప్రభుత్వమువారు కొనవ గీకరింపవలెనియు యుద్ధారంభముననే నేనుకోరియుంటిని కాని ప్రభుత్వమువారు నాసూచనను లక్ష్యంచేయలేదు. మోటారుకార్ల పరిశ్రమను వృద్ధిచేయు విషయమై నేనుగావించినసూచనలకుగూడ ఈగతియేపట్టెను. ఏసూచన గావించినను ప్రభుత్వము వారు దానిలోరంధ్రములు వెదుకుచున్నారుగాని పరిశ్రమను స్థాపించుప్రయత్నములేవియు చేయుటలేదు. భారతదేశములో ఓడలుకట్టవలెనని

## భారతదేశ యుద్ధనౌక మునిగిపోవుట

బొంబాయి, జూను ౨౮

కాపలాకాయుచుండగా హెచ్.ఎమ్.ఐ.ఎస్. "పఠాను"మునిగిపోయినట్లు తెలియుచున్నది. ఇద్దరు అధికారులు, ఒకచిన్న అధికారి, ఇద్దరు నావికులు చనిపోయిరి. ఒకఅధికారి ౩గురు నావికులు గాయపడిరి.

ఈఓడ ౬౧౯ టన్నుల డిస్‌ప్లేస్‌మెంటుకలది. వేగము ౨౦ నాట్లు. ఒక నాలుగుఅంగుళముల ఫిరంగి, రెండు 3 అంగుళములఫిరంగులు దానిలో నుండెను. ౬౫గురు దానిలోప్రయాణముచేయుటకుఏర్పాటుండెను. నావికులను తర్ఫీదుచేయుటకదిఉపయోగించుచుండిరి. ౧౯౧౮ సం॥లో అదినిర్మింపబడియుండెను.

## దేశరక్షణ నియమాల క్రింద చర్యలు

అలహాబాదు, జూను ౨౮

బీహారు రాష్ట్రీయ సోషలిస్టుపార్టీలోను గయా మండలసంఘములోను సభ్యుడుగానున్న ఏ. అజీజుగారినిమొన్న గయలో అరెస్టుచేశారు.

**ఫిల్ము నిషేధం**

"నాజీ జర్మనీలోపల" అనేఫిలుంను సంయుక్తరాష్ట్రములలో ప్రదర్శించగూడదని రాష్ట్రీయ ప్రభుత్వమువారు పకటించినారు.

నాగపూరు కార్మికనాయకుడు శ్రీపాద చతమలుగారికి ఆకోలా మేజీస్ట్రీటు ౬ నెలలుకఠినశిక్ష విధించినాడు.

---

౧౬ సంవత్సరములనుండి మనము నెత్తిననోరుపెట్టుకొని అరచుచుంటిమి. మనదేశమును రక్షించుటమాత్రమే గాక చతుస్సముద్రములలో మనము వెళ్లుటకువీలగు ఓడలను మనమే నిర్మించుకొనుచో యిప్పుడెంతబాగుగానుండెడిది. కానియిట్టి పరిశ్రమలకు ప్రభుత్వమువారు సౌకర్యములొసంగరు. యుద్ధముప్రారంభముకాగానే పరిశ్రమపై భారములను మోపుటకుమాత్రము పూనుకొనిరి.

## క్రీ.శ. ౭౧౧౩వసం॥ వరకు ముఖ్యనాగరిక విషయములనురక్షించుట

**అందులో భారతదేశ యోగగ్రంథాలు**

అమెరికాలో ఓగ్లథోర్పువిద్యాపీఠమువారు ఇంతవరకు మానవునినాగరికతయందు జరిగిన అభివృద్ధిలో ముఖ్యవిజ్ఞానమునంతయు అధమపక్షము క్రీ-శ-౭౧౧౩ సం॥ వరకు ఎట్టినష్టముగాని కలుగకుండునటుల రక్షించుటకు పూనుకొని అట్టిగ్రంథములు మున్నగువానినంతయు ఒకసమాధిలో స్థాపించుచున్నారు. ఈ సమాధిస్థాపనము పోయిన మే ౨౫వ తేదిలో సమాప్తమైనది. ఈ సమాధిలో దాచిపెట్టిన గ్రంథాలలో యోగమునుగూర్చిన గ్రంథాలుకొన్ని ఉన్నవి. వాటిని రచించినవారు బొంబాయిలో యోగసంస్థను నిర్వహించు శ్రీ యోగీంద్రగారు.

**కాంగ్రెసు సంఘసభ్యుల అరెస్టు**

బీహారులో వాజిమూరులో గాంధి ఆశ్రమములోనివసించుచున్న పాట్నామండల కాంగ్రెసు సంఘసభ్యులనిద్దరిని మొన్నటిరోజున గాంధి ఆశ్రమములో అరెస్టుచేసిరి. బీహారు కాంగ్రెసు సోషలిస్టు పార్టీవారు ప్రకటించిన కొన్ని కరపత్రాలను పోలీసువారుతీసుకొనిపోయిరి.

**బీహారు రాడికలు లీగు కార్యదర్శి అరెస్టు**

పాట్నా, జూను ౨౮

డేరాడూను, మేజస్ట్రీటు పంపినవారంటు ప్రకారం నేడు పాట్నాలో బీహారు రాడికలు లీగు ప్రధాన కార్యదర్శి టి. పరమానందుగారిని అరెస్టుచేసి డేరాడూను తీసుకొని పోయిరి.

**ఖాక్సారులకు శిక్షలు**

లాహోరులో మునిసిపలు గార్డెనులో నిద్రపోవుచున్న ఖాక్సారులను ౭ మందిని యీనెల ౧౮వ తేదిని అరెస్టుచేసిరి. ఈనెల ౧౭వ తేదిని ఆరుగురు ఖాక్సారులను అరెస్టుచేసినారు, ౨౮వ తేది వీరిలో మొదటిజట్టు ౭ గురికి చెరి మూడు నెలలున్ను, రెండవజట్టు ౬గురికి చెరి ఆరునెలలున్ను కఠినశిక్ష వేయబడెను.

